కెంతు విషయములలోఁ బ్రధానముగ నా యాజ్ఞోల్లంఘనము చేసితిరి. భట్టి: నాకు జ్ఞాపకము లేదు. నాకుఁ దెలియదు. చక్ర: ఏమి తెలియదు? మహాచైత్రోత్సవము జరిగిన నాఁడు పట్టమహిషి గారికోసము మొగము మాటి మాటి సర్వజనులలోఁ జక్రవర్తికిఁ దలవంపైనది. దాని నోర్చుకొన్న చక్రవర్తి మఱి దేనికోర్చుకో లేఁడు కాని నేటి నిరసన మోర్చుకోలేకపోయినాఁడు. కాళింది దర్శనము చేయుటకుఁ గబురంపితిని. నాకు సామ్రాజ్యము కంటె, బౌద్ధమతముకంటెఁ గాళిందీదేవి శాంతిప్రసాదిని. ఆమెను మీతోఁ గలసి వచ్చింపవలెనని కోరుకొంటిని. భట్టి: ప్రభూ! మీకు నలుఁబదియేండ్లు వచ్చినవి. నాకు నలుఁబదేండ్లు వచ్చినవి. పురుషులకు నలుఁబదేండ్లు పడిఁగౌవనము కావచ్చును. స్త్రీలకు గాదు. షష్ఠిశ్రీ పసిపిల్ల. ఆమె లోకైకసౌందర్యవతి. ఈపట్ట మహిషిత్వ మామె కిచ్చి, యామెతోఁ గలసి యచ్చటికిఁ బోరాదా? చక్ర: భట్టీ, జక్రవర్తియు, నాజ్ఞానుసరణమును బ్రతీక్షింతురుగాని యాజ్ఞాస్వీకరణమునకు రారు. భట్టి: ప్రభూ! అట్లయినచో నేను వత్తును పదండి. సాయంతనమా? ఇప్పుడేనా? చక్ర: మీకు రానక్కఱలేదు. భట్టి: క్షమించవలయును. తమకుఁ గోప మేలవచ్చెనో నాకుఁ దెలియకున్నది. చక్రవర్తి తనకిందుకు వచ్చెనని చెప్పలేను. ఇంతకుముందు నేను గబురు పంపితిని. ఈ వేళ రాలేదని యనలేను. నిజ మేమనఁగాఁ జక్రవర్తి కబురు వచ్చినపుడు భట్టిదేవి ధ్యానములో నుండెను. ఆమెను ధ్యానసమయమందు దాసియొద్ద లామెకుఁ దెలియదు. చెప్పిన దాసి, వినయములో సన్నవిస్వరముతోఁ జెప్పెను. ఆమెకుఁ జక్రవర్తి వద్దనుండి కబురు వచ్చినదనియే తెలియదు. చక్రవర్తి మఱలఁ బ్రత్యగ్రదశనందిన యిరువదియేండ్ల కోపము

మనసులోఁ బెట్టుకొని బయల్దేరెను. పోవుచుఁ బోవుచు గడపలో నాగి యిట్లనెను. "నీవు సుక్షత్రియకుటుంబమున జనించితివి. నాజన్మ నాకే తెలియదు. నిన్ను రాక్షసవివాహము చేసికొని తెచ్చితిని. తప్పంతయు నాదికాని నీదిగాదు. వీరపురుషదత్తుఁడు నట్టి దురదృష్టవంతుఁడు. అతనికి భట్టిదేవిమీఁదఁ బ్రేమకలదు. భట్టిదేవి సుక్షత్రియ. ఇట్లతని ప్రేమ వ్యర్థమయ్యెను. వీరపురుషుఁడు సత్పురుషుఁడుగాఁడు. పగతీర్చుకొనువాఁడు. పదునాలేండ్లు తీర్చుకొనెను. ఇంకను దీర్చును. ఇదివఱకుఁ దీర్చినది తీర్చినట్లే కాదు. ఇప్పుడు తీర్చుచుండునదియే నిజముగాఁదీర్చుట. వీరపురుషునకు క్షత్రియులమీఁద, బ్రాహ్మణులమీఁద నెందు కింత కోపము? ఈ కోపమునకుఁ గారణ మెవరు? భట్టిదేవి. ఈ రాజ్యమంతయు బౌద్ధమయముగాఁ జేసిన దెవరు? భట్టిదేవి. వీరపురుషుని జీవితములో విష మొలికించిన దెవరు? భట్టిదేవి. వీరపురుషుని జీవితమంతయు నొక విరహావస్థాఘట్టము జేసిన దెవరు? భట్టిదేవి. భట్టిదేవికి క్షత్రియత్వ మన్న నంతయభిమాన మెందులకు? బ్రాహ్మణు లన్న నంత గౌరవ మెందులకు? ఆ బ్రాహ్మణ్యమునకుఁ బ్రతిక్రియగా వీరపురుషుఁ డొంతచేసినాఁడు. అంత క్షత్రియులకుఁ జేయలేదు. ఇపుడు క్షత్రియులనుఁ జేయును అనుచుండఁగా, భట్టిదేవి కోపమును, శోకమును రెండును గలుగగాఁ జక్రవర్తి వంకఁ గోపముతోఁ జూచుచుఁ, గనుల వెంట నీరుగార్చుచుండెను. చక్రవర్తి యామె యెట్టిస్థితిలో నున్నదో విచారింపనే లేదు. ఒక విధురధ్యానముతో నచటి నుండి వెడలిపోయెను. ఆయన తన సౌధమునకుఁ జేరినంతనే కొడబలి యచ్చటనే కనుపించెను. ఆయన కొడబలిని జూచి యిట్లనెను, "అమ్మా! నేను నీకుఁ దండ్రినిగదా? కొడ: అవును.

చక్ర: లోకములోఁ దండ్రికన్న నధికులుందురా? కొండ: ఉండరు. చక్ర: తేపునకు వివాహమైనచో, నీభర్తనాతండె నధికుడుగా గన్పించునా? కొండ: నేను వివాహమే చేసికోను. చక్రవర్తి: అదియేమి? కొండ: నేను బౌద్ధభిక్షుకురాల నగుదును. చక్ర: ఊరకే వివాహము చేసికొనుము. తరువాత భిక్షుకురాలవు కావచ్చును. కొండ: అట్లే. కొండబలి గర్భములో భర్తృనిరాకరణహేతువున నైనను, నక్తనిష్ఠ మహాజపనిరాకరణముచేతనైనను, భర్తనెడబాసి యుండఁగలిగిన గుణము సహజముగా నుండెను. రెండవది సంప్రదాయోత్తరముగఁ బ్రవర్తించుటకుఁ దండ్రి పెంపక ముండెను. కొండబలికి వివాహము, భర్త, సంసారము ఈ మొదలైన భావములేమియుఁ దెలియవు. ఆమెకు దన తండ్రి భగవంతుఁడు, తనయన్న కాబోవుచక్రవర్తి. భగవంతుడు మొదలైన బౌద్ధమతాచార్యులు సృష్టిలోని సర్వసంభారములు విజయపురము బోధిసత్వుని రాజధాని. మఱి యేదియుఁ దెలియదు. ఎంత తెలియనిపిల్ల కాకపోయిన, మహాచైత్యోత్సవములోఁ బోయి పట్టమహిషీనిర్ణీత సింహాసనముపైఁ గూర్చుండునా? ఆమె పుట్టిననాఁటనుండియు, స్త్రీలలోఁ బెంపఁబడలేదు. తండ్రి కనుమఱఁగి బ్రతికిన నిముసము లేదు. ఆమెకు సృష్టియంతయుఁ బురుషమయము. స్త్రీపురుష సంయోగముచేత సృష్టి జరుగుచున్నదన్న జ్ఞానమే యామెకు లేదు. యౌవనోదయముతో జంతువులకు లింగజ్ఞానోదయము కలుగు నని కొందఱు చెప్పవచ్చును. ఆమె కదియు లేదు. బాహిరములైన కారణములు తద్జ్ఞానమునకుఁ బరిపోషకములేమో! ఆ బాహిరములైన కారణములు కొండబలికి సమకూడుటకే వీలు కాలేదు. ఇంక నామె

స్త్రీ కాదు. పురుషుఁడుఁ కాదు. భట్టిదేవిమీఁదఁ జక్రవర్తి పగ తీర్చుటకు నుపయోగపడు నాయుధమువలె నిలఁబడెను.

చక్రవర్తియొక్క పగతోన భట్టిదేవి పుట్టినింటి యందుండెను. భట్టిదేవి కదంబుల యాఁడుబిడ్డ. భట్టిదేవి యన్నగారు రాజు. ఆయనకిద్దఱుకుమాళ్ళు. పెద్దవాఁడు యువ రాజు. అతనికి వివాహమయ్యెను. రెండవవానికి వివాహము కావలయును. కొడుకునకుఁ దగిన సంబంధము. వీరపురుష దత్తుఁడు తన చెల్లెలి నెట్లు చూచునో కదంబవనవాసులకుఁ దెలియని విషయముకాదు. కాని పట్టమహిషి యామెయే యగుట, యామె మర్యాద కెప్పుడు భంగము కలుగకుండుట కారణంబులను భట్టిదేవివిషయమునఁ గోపము గలుగనియలేదు. ఇప్పుడు వీరపురుషదత్తునివద్దనుండి వార్త వచ్చెను. తన రెండవ కుమారునకుఁ గొడబలి నిత్తుమని. భట్టిదేవి సోదరుఁడు చాల సంతసించెను. తన రెండవకొడుకు రాజుకాఁడు. చక్రవర్తి కొక్కతెయే కూఁతురు. మూర్ధాభిషిక్తుఁడు కానేరని తనకొడుకు నకుఁ జక్రవర్తి కూఁతు నిచ్చుట యతనికి భట్టిదేవియందుఁగల గౌరవము, తనయందుఁగల గౌరవము. చక్రవర్తి బౌద్ధుఁడు. అయినను క్షత్రియులైన తమతో సంబంధము వదలుకొనుట కిష్టములేనివాఁడని వచ్చిన బ్రాహ్మణులును, మంత్రులును జెప్పిరి. వారు సాక్షియుఁ జెప్పిరి. చక్రవర్తి మనస్సు బౌద్ధమతము నెడల విముఖమయ్యెనని, మరలఁ దాను క్షత్రియుఁడుగా నుండ వలెనని వాంఛించుచున్నాఁడని. కదంబరాజు మిక్కిలి సంతో షించెను. సంబంధమంగీకరించెను. కదంబులు వనవాసము నుండి విజయపురికిఁ దరలివచ్చిరి. చైత్రోత్సవ మెంతవైభవ ముగా జరిగెనో, వివాహమంత వైభవముగా జరిగెను. వివాహ

వెళ్ళినచో నీమగఁ డేమికావలయు ననెను?" కొండబలి యతనిని గూడ నమ్మను మనెను. అదివఱకే పండ్లు పులిసిన పెండ్లికొడుకీ సమాధానము వినిన తరువాతఁ బండ్లనొప్పి మొదలుపెట్టి పండ్లకుఁ గప్పు వేయవలసినంత స్థితివచ్చెను. కాని సర్వము నింత వ్యతిరేకముగా నున్నను, పెండ్లికుమారున కొక్క యాస కలదు. చక్రవర్తి కూఁతురున్న వ్యామోహము. కొత్త కొద్ది గుర్రము, తమ యూరునకుఁ బోయినతరువాత నామెను గర్వములోనికిఁ దీసికొని రావచ్చునని యూహ. ఇట్లు వివాహ మెల్ల రసాభాస మయ్యెను. నాలుగవదినమున మగపెండ్లి వారు బయలుదేరిరి. పెండ్లి కూఁతును బంపించు మనిరి. కదంబరాజు తన తోఁబుట్టువుతో భట్టిదేవితో మాటాడెను. భట్టిదేవి పెండ్లి మూన్నాళ్ళు దూరదూరముగ నుండెను. నగలు ధరించీ ధరింపక, మొగము చూపీ చూపక, యొదిగి యొదిగి యుండెను. తన యన్న గారితో భట్టిదేవి యిట్లనెను. "ఈ వివాహము నన్నడిగి చేసి కొనిరా? కొండబలి నా కూఁతురుకాదు. ఆమె క్షత్రియ కాదు. అసలాఁడపిల్ల కాదు. చక్రవర్తి నామీఁద బగతీర్చుకొను నాయుధము. నే నాయనను క్షత్రియుఁడు కాఁడని యన్నదిలేదు. ఆయన క్షత్రియుఁడు కాఁడన్న యూహ నేనుగా మూర్తికట్టితి నని యాయన యూహ. ఇది యాయనయే కల్పించుకొని యాయనయే దోహదముచేసి యామెను బ్రతీకారాస్త్రముగా సిద్ధపఱిచెను. మీరు తెలియక యీ వ్యూహములోఁ బడిరి. కొండబలి రానురాదు. సంసారమును జేయదు. ఎట్లు చేయును? ఆమె స్త్రీ ప్రకృతి బాహిరురాలు" కదంబరా జాలోచించెను. బంధుత్వములో నమ్మకములో నింత ద్రోహము చేయునా? ఇక్ష్వాకు సామ్రాజ్యము తాము పడమటి దిక్కున, తూర్పు

లు తన దిక్కునఁ బెట్టనికోటవలె నిలచియుండుటవలనగాదా సాగుచున్నది? ఇప్పుడే విజయపురముమీఁద యుద్ధము చేసినచో నేమగును? తన సైన్యము వినాశముకొఱకుఁ బెట్టిన పరిమిత సైన్యముగాని దండెత్తి వచ్చునట్టి యపారసైన్యము కాదు. తాను విజయపురిమీఁదికి దండెత్తి రాఁగలఁడా? దండెత్తి వచ్చి నను గెలుపును వశపఱచుకొనుట ప్రమాదము కాదు. ఆ యపారమైన ప్రతి పాలకులకు సాధ్యము. ద్రోహమును ద్రోహముతో నెదుర్కొనుట మంచిది. తాము తమ రాజ్యము నకుఁ బోయి యిక్ష్వాకురాజ్యపు టెల్లలను గొట్టవలయును. మఱి సేనలైనఁ జేయవలయును. ఇందు భట్టిదేవి మొగమోట మియు లేదు. భట్టిదేవి యిప్పుడు విడిదిలో నుండెను. కాని తమ మనస్సు కొంత గాఢపడినను కొంత చక్రవర్తి కిట్లని తెలియఁ జేయవలెను.

మఱునాఁడు కోసలరాజ పరివారమంతయు వెడలి-పోవునుఁ బెండ్లికూఁతురును బంపించవలయునని మంత్రులఁ జక్రవర్తి నడిగిరి. చక్రవర్తి యామెనిప్పుడే తీసికొనిపొండనెను. వారు పోయి కొండబలి నడిగిరి. కొండబలి సజ్జముమీఁద వచ్చి యిట్లనెను. 'నేను చక్రవర్తి కూఁతురను. పెండ్లికొడుకు సామాన్యుమైన రాజకుమారుఁడు, నే నచ్చటికి వచ్చుట నా మర్యాదాభంగము. పెండ్లికొడుకే యిచ్చటనుండిపోవచ్చు' ననెను. కోపము తెట్టున్న యామె మాటలు కొంతవఱకు సమంజసములుగాఁ గన్పించెను. పెండ్లికుమారుని మనస్సునకుఁ గొంతవఱకు వానియందు సొంపుకూరెను. అహో! కొండబలి శరీరము స్త్రీశరీరమగుటచేతఁ బెండ్లికొడుకు పొందిన మోసము చెప్పరానిది. చివరకుఁ బెండ్లికొడుకు విజయపురమునుండిపోవునట్లు నిశ్చ

యింపఁబడెను. తక్కిన రాచపెండ్లి వారందఱు వెడలిపోయిరి. పరిమిత పరివారముతోఁ బెండ్లికుమారుఁడు మాత్రము దిగఁబడెను. రెండు మూఁడు దినములు గడచెను. వారము గడచెను. రెండు వారములు గడచెను. మాసము గడచెను. రెండు మూఁడు మాసములు గడచెను. పెండ్లికొడుకు పేరు విజయవర్మ. విజయపురములో నతనిపే రెవ్వరికిని దెలియదు. పెండ్లికూఁతునకుఁ దెలియదు. అతని నల్లుఁ డనికూడ వ్యవహరింపరు. పెండ్లికొడుకని మాత్ర మందురు. పెండ్లికొడుకు మేడనుండి ప్రతి సాయంకాలము పరిచారిక కోడబలిని దీసికొని వచ్చుటకుఁ బోవును. కోడబలి బౌద్ధవిహారములలోఁ దిరిగి తిరిగి జేయి రెండుజాములు దాఁటినతరువాత వచ్చును. మూఁడు జాములు దాఁటిన తరువాత వచ్చును. ఒకప్పుడు రానేరాదు. ఉదయకాలములయందే స్తూపప్రాంత శిలావేదిక పైననో పండుకొని నిద్రించుచుండును. తల ముసుఁచుటయు. నాకంఠముగఁ దాల్చిన శితకంథయు నామె బౌద్ధ భిక్షుకురాలితనము తెల్పును. విజయవర్మపరిచారకులెవ్వరైన బోయి 'అమ్మా! మీ భర్త తమకొఱ కెదురు చూచుచున్నా' రని చెప్పినచో నామె తీక్ష్ణముగాఁ జూచి "నాకు భర్త యెవరు? నేనే యతనికి భర్తనని చెప్పుఁ" డనును. మొదటి దినములలో దాఁచఁబడిన యీ మాట పోనుపోను విజయవర్మకుఁ బ్రకాశితమయ్యెను. విజయవర్మ విజయపురమున నాల్గునెలలు కాపురము చేసెను. అతనికిఁ బోనుపోనొక భయము కల్గెను. తాను దన దేశము పోనెంచినచో పోనిత్తురా? తన్నిచ్చట బంధితుని జేయుదురా? ఒకనాఁ డతఁడు చక్రవర్తి వద్దకుఁ బోయి. 'మహారాజా! నేను మా యూరు పోదలఁచుకొన్నా' నని చెప్పెను. ఆ చెప్పుట

కాళిందీదేవివద్ద జరిగెను. కాళింది యిట్లనెను. 'అది యేమయ్యా! భార్య యిచ్చట నుండగా, నీ వచ్చటి కేల పోవుదువు! భార్యను దీసికొనిపోవుదువా?' యనెను. విజయవర్మకుఁ జక్రవర్తి యెదుట నిమాత్రము మాటాడినవారిదివఱకుఁ గనిపించలేదు. అతని రాచనెత్తురు మాటపెఱుగు సడలించి హృదయములోని కోపమునే వెలిపఱచెను. "అమ్మా! నీ వెవరు? చక్రవర్తి యెదుట నింతమాత్రము మాటాడుటకు సాహసించితివి! ఈయన నా మేనత్తభర్త. ఈయన కూతురు నాకు మేనత్త కూతురు. ఆమె చక్రవర్తి కూతురు. నేను పట్టి రాజకుమారుఁడను. ఆమె బౌద్ధురాలు. నేను క్షత్రియుఁడను. మా మేనత్త క్షత్రియ. చక్రవర్తి బౌద్ధుఁడు. పదునాలుగా మా దాంపత్యమును జూచుచుము. ఇఱువదియేండ్ల నుండి మా మేనత్త యెట్లున్నదో నేనట్లు కాబోవుచున్నాను. ఈ బౌద్ధమత మను నిర్వికారమైన నాగార్జునకొండకుఁ గొట్టుకొని మా క్షత్రియత్వ మను కృష్ణానదీప్రవాహము తరగలచులఁ బ్రిదిలిపోవుచున్నది. మహర్షుల కూతురైన యీ వాహిని బౌద్ధుల భిక్షాపాత్రల నింపుటకు బుట్టినది. రాజదుహిత యొకపగసాధనము. ఆ పగను మొదలి తుదళ్ళు తెలియవు. నా క్షత్రియత్వమును జక్రవర్తి నాశనము చేయుటకుఁ దలపెట్టినాఁడు. నేను నాక్షత్రియత్వమునునాశనము గానీయను. నా శరీరమును జక్రవర్తికి నీ మాటలతో నిచ్చుచుంటివి. చక్రవర్తి బ్రాహ్మణులను గత్తితో నఱకినాఁడట. బ్రాహ్మణులను నఱకవచ్చును, బ్రాహ్మణులు సాయుధులా? వారి యాయుధము క్షత్రియులు. నన్ను నఱుకుమనుమా" యని విజయవర్మ తలవంచి నిలుచుండెను. కాళిందియుఁ జక్రవర్తియు నిశ్చేష్టులై నిలచిపోయిరి. కొంతసేపుండి విజయవర్మ మఱల

నిట్లనెను. 'నేను రాజద్రోహము చేసితిని. ఈ రాజ్యములో నిది రాజద్రోహము. మా రాజ్యములో నీ మాటలు రాజద్రోహములు కావు. అనగా నా రాజున కధికార మున్నంత చేయుటయే రాజద్రోహము. ఆహా! యేమి రాజాధికారము! ఈ రాజాధికారమునకు ధర్మమునకు సత్యముతో వ్యాప్తిలేదు. తన చుట్టు నిరీక్షించుకొని యుండుటయే సర్వాధికార మనుట.

అనాడు సాయంకాలము విజయవర్మ తనదేశమునకు బ్రయాణముకట్టెను. ప్రతిపదము రాజాధికారులు తన్నడ్డగింతురనియే యాయన యనుకొనెను. సర్వాధికారులు తమున్ముఖులుగా నుండిరి. ఒక్క రాజాజ్ఞయైన లేదు. వాని సైన్యములు రథములు విజయపుర గ్రామోత్తరదిశామహాద్వారమునుండి వెలువడెను.

ఆయన వెడలిపోయెను. వెడలిపోయినంతనే దక్షిణాపథమంతయు విజయవర్మ దుఃఖాశ్రుమూర్తి, వర్షరువు ప్రారంభించెను. మలుసంజలు ప్రతీకార రక్తచ్ఛవు లయ్యెను. కృతనిశ్చయక్షత్రియవరాళీబద్ధ సీమంతకేశబంధములవలె మొగిళ్లాకసమున నల్లగా ముసురుపడెను. క్షత్రియహేతిచ్ఛటలవలె సౌదామినులు వియదంచలము లయ్యెను. వనవాసప్రాంత పశ్చిమగిర్యగ్రభాగములం గురిసిన వానలకొలంది కొండలపైనుండి క్రిందపడుచు కొండచిలువలవలె సెలయేళ్ళు ప్రవహింప నారంభించెను. ఇచట మహాపర్వతములు; ఇచట లోయలు. ఈ లోయలలో మేఘములు పట్టును. గిరిమేఖలాభాగములు నిర్ఘోషములుగా నుండెను. కదంబదేశమంతయు, మేఘాచ్ఛాదిత మయ్యెను. నిష్ప్రభాకరితమయ్యెను. గిరిదరీఝరీపరిపూర్ణ మయ్యెను. క్షేత్రపుల నేలమీదంగూడ నీ మొయిళ్ళగాలి సోకెను. సహ్యజటాధారాసమారబ్ధ మోదావళులు హేతి

సద్భ్రాతృవిమర్శకత్వ [illegible]ను వెలయించెను. ఇతరమతములైన చిన్న చిన్న రాజ్యములలోఁ గూడఁ గత్తులతో పాటు మొఱపులు మోఁగెను. క్షత్రియుల కన్నీళ్లతో పాటు [illegible] కురిసెను. వారి ప్రతిజ్ఞా వాక్యములతో పాటు [illegible] మారెను. మున్ను ప్రఖ్యాతి భద్రమైన యిక్ష్వాకురాజ్యము నేఁడు నాలుగుదెసల విద్యు త్సంక్షోభనముల నెఱత్రిశిచేత సంఘర్షణోపహసితమైన ట్లుండెను. కృష్ణానది తన కేళీయుఁ బట్టకల్లు, నానాప్రజానికాంత కెరఁటఁ బ్రవహించుచుండెను. ఆమె తన తరంగములతోఁ గొండను కుద్దాలించవలయు నని పో! నానాప్రజానికాంగమొక్క ప్రత్యంతధాత్రిమాత్రము తన శిలాఘట్టనవల్ల విసరి విసరి ముసరిన తరంగములఁ జిన్నపలుగాఁ జేయుచుండెను.

---

# చతుర్దశాధ్యాయము

---

చైత్ర మేఘములు ముసరినకాలఁడి వీరపురుషదత్తుఁడు తనలోఁ దాను ముసుచుకొనఁజొచ్చెను. భట్టిదేవిని గెలుచుకొని వచ్చుటకుఁగరవాలహస్తుడై బయలుదేరిన వీరపురుషదత్తుఁడేనా యీయన! వాగర్థ్యములోఁగూడఁ బరాక్రమము వెలయించుట యిక్ష్వాకులలో శాంతిమూలచక్రవర్తితో నేపోయెనా? తన కొడుకు బాహుబలశాంతిమూలుఁడు పందొమ్మిదేండ్ల వాఁడు. ఆయన యువరాజై యుండెను. రాజ్యభారమంతయు నతనిమీఁదఁ బెట్టి మాఠరీపుత్రుఁడు రూపముచేతఁగూడ బౌద్ధసన్యాసియై యుదయసాయంకాలములయందు కాళిందీసౌధమునకుఁ బోవుటయు, వచ్చుటయు నతని హృదయములో బౌద్ధమతము సంపూర్ణమైన దశనందిన ట్లుండెను. బౌద్ధసిద్ధాంతము లన్నియు

భదంతాచార్యులు చెప్పిరి. అవి తెచ్చెదు శాంతియంతయు కాళింది తెచ్చెను. ఇన్ని రోజుల నుండి కాళిందీదేవి భదంతాచార్యుని దర్శించలేదు. ఆమె తనవిహారము వదలి పెలువిహారమునకే పోదామెను. మాతాపితృులు తన సంసవృలైన యీ యిద్దరిని సమావేశపఱచి వారి వాదనల సారాంశమును జూచి కొనవలయునని తలంచెను. కాళింది యిల్లు కదలదు. భదంతు నే యచ్చటికిఁదీసికొనిరావలయును. ఆచార్యునితోఁబరిపనుకొకండు సాక్షుచెప్పి వివర కొకప్పుడు భదంతాచార్యుని గాళింది యింటికిఁ దీసికొనివచ్చెను. వారు మువ్వురు నొకచోట నే కూర్చుండిరి. సమాచారములు నడచినతరువాత చక్రవర్తి యిట్లనెను. "ఈమె నాకుఁదల్లి. మీ రాచార్యులు. మీ రిరువురును బౌద్ధ మతరహస్యములు చర్చించినచో వినవలయు నని నా కున్న దనెను. భదంతాచార్యుఁ డిట్లనెను. "విచారించుట కేమున్నది? "ఏకం హిందసచ్చం, నదుతీయమత్థి యస్మిం పజానో వివదేప జానం" అని బుద్ధదేవుఁడు ధమ్మపథములో చెప్పెను. సత్య మొక్కటియే. ఇది తెలిసినవాఁడు వివాదముచేయఁడు. కాళింది: గురూ! తెలిసినవాఁడుకదా వివాదము చేయనిది. తెలిసికొనవలయునుగదా!

భదంత: "సోకరోహి దీపమత్తనో, కిప్పం వాయను పండితో భవ, బద్ధంత్ర అనంగనో, దిబ్బం అరియభూమినేహిసి"

నీవే ఆత్మను దీపము చేసికో, దుర్గుణములు వదలి దోషములు లేకుండ దివ్యమైన పరమపదమును సమీపించుము.

కాళింది: స్వామీ! ఇచ్చట ఆత్మయన్న శబ్దము 'స్వ' యన్న మాత్రమేనా? ఆత్మ యన్న పదార్థమా?

భగవంతుడు: ఆత్మయన్న పదార్థమునను మొదట కొందఱు. కాని బౌద్ధులలో రెండుసిద్ధాంతములున్నవి. ఒకసిద్ధాంతమువారు బాహ్య ప్రపంచమును, అంతర్ ప్రపంచమును కలదందురు. ఇవి రెంటిని గలిపి విశ్వమందురు. ఈ విశ్వ మణువులయొక్క సముదాయముచేత జరుగుచున్నది. ఇవి నాలువిధములు. పృథివ్యణువులు. జలాణువులు. అగ్న్యణువులు, వాయ్వణువులు. ఈ నాల్గింటిచేతను బాహిర ప్రపంచ మేర్పడుచున్నది. ఇక అంతర ప్రపంచము ఇది పంచస్కంధములచేత నేర్పడుచున్నది. మొదటిది రూపస్కంధము. దీనివలన పంచేంద్రియములు, తద్విషయములు కలుగుచున్నవి. రెండవ జ్ఞానస్కంధము. ఇది అహంప్రత్యయకారి. మూడవది వేదనాస్కంధము. ఇది సుఖదుఃఖముల హేతువు. నాలవది సంజ్ఞాస్కంధము. దీనివలన నీ సృష్టిలోని వస్తువులు. వాని నామములు. దీనివలన చున్నవి. ఐదవది సంస్కారస్కంధము. దీనివలన మోహము, వైరాగ్యము, ధర్మాధర్మములు– ఇవి ఏర్పడుచున్నవి. కాళింది: ప్రభూ! నాకొక బలుదినములనుండి సందేహములు కలవు. వానిని దమవంటి పెద్దలు తీర్చిపెట్టవలయును. భగవంతుడు: అడుగవచ్చును. కాళింది: ఈయణువాదము బౌద్ధులుకొ్రొత్తగాఁగల్పించినదికాదు. ఇదివఱకే యున్నది. ఈ విశ్వ మణువుల సముదాయముచే జరుగుచున్నచో, నాయణువుల సముదాయమెవరిచేఁ జేయఁబడు చున్నది! ఆ సముదాయము జరుగుట చూడఁబడిన విషయమేని మనుష్యజన్మ జరిగినతరువాత నది జరుగవలయును. మనము దానిని జూచితి మనఁగా నదిరొక ప్రశ్నయత్నమో, యిదివఱకే జరిగియుండ నాఁగాజూచుటయో జరిగియుండవలెను. సృష్టికి బూర్వ మిది జరిగినచో, నప్పటికి శరీరము లేదు; మనస్సు లేదు. దీనికి

కారణము చూడరాని దొక యదృష్ట మందుము. అది యాత్మలో నున్నదా? అణువులలో నున్నదా? ఈ యదృష్టము చేతనమా, యచేతనమా? అది యచేతనమైనచోఁ బంచస్కంధముల కతీతమైన యొక పరమాత్మ కానలయును. ఈ క్రియాశక్తి యణువులయం దున్నచో లయము జరుగదు. సర్వసృష్టి నిత్యముగా నుండవలయును. అణువులు సచేతనము లైనచో, మఱియొక సచేతనమైన యదృష్టముతోఁ గలియవు. అణువు లచేతనము లైనచో, సచేతనమైన యదృష్టముకంటె భిన్నమైనవి కానలసివచ్చును." భదంతుడు: అణువులు మొదట ద్వ్యణుకము. అణువులు భిన్నములు; ఇటు ద్వ్యణుకము లసంఖ్యాకములు చేసి సృష్టి యేర్పడుచున్నది. కాళింది: రెండణువులు కలియుటకు గల్పి పెట్టునది వేఱై యుండవలయును. ఇట్లే ద్వ్యణుకములను గలుపుటకును, వేఱు వేఱు సమవాయ శక్తులు కావలసియుండును. ఈ సమవాయశక్తి లేకుండ నవి కలసికొనలేవు. అప్పుడు సృష్టియే లేదు. ఈ యణువులకు వర్ణాదులు లేవు. ఈ సృష్టిలోనున్న వైచిత్ర్య మెట్లుకల్గెను. భదంతుడు: అణువులకు రూపాదిమత్త్వము కలదు. కాళింది: ఐనచో నవి యణువులు కావు. స్థిరములు కావు. అవి దృష్టములు; పృథివీ పదార్థములు. పరమసూక్ష్మములు కావు. అందుచే నవి నశింపవు. సృష్టి కవి హేతువులును గారాదు. మఱియు నింకొక యిబ్బంది కలుగుచున్నది. పృథివ్యణువులకు స్పర్శము, రుచి, వాసన, రంగు, ఈనాల్గుగుణము లున్నవి. జలమునకు మొదటి మూఁడుగుణము లున్నవి. అగ్నికి మొదటి రెండు గుణములున్నవి. వాయువునకు మొదటి యొకగుణమే కలదు. అప్పుడు నాల్గుగుణములు కల పృథివ్యణు వేక గుణముకల వాయ్వణువుకన్న పెద్దది కావల

లేకుండ నిల్లు జరుగదుకదా! అందుచేత సమవాయము జరుగుచున్న దని మనము తెలిసికొనవలయును. కాళింది: అది సరే! వీనిలో నొకదాని కొకటి కారణము. ఈ యన్నింటికిఁ గారణమైనది లేదుకదా? అప్పుడు కారణాభావ మేర్పడు చున్నది. ఈ శరీర మాత్మయొక్క సుఖదుఃఖముల కోస మేర్పడుచున్నది. ఇది క్షణికము. అందుచేత ననుభవితకాదు. ఈక్షణికమైనదానికి విముక్తి యేమి? బంధ మేమి? బంధ విముక్తులు లేనప్పుడీ సమవాయము జరుగుట యెందులకు? ఈ యణువులు వాని యంతట నవి యిల్లు పెనగొనుచున్న వన్నచో నవి యట్లేల పెనగొనవలయునో తెలియరాదు. భిన్నము కాని కుండ, భిన్నమైన కుండ-పూర్వము, పరమునకు హేతువు. పూర్వమున కేమి హేతువు? కుమ్మరివాఁడు, చక్రము, మన్ను-ఇవి యన్నియు నుండవలయును - మన్ను దానియంతట నది కుండ కాలేదు. చక్రము దానియంతట నది పరిభ్రమణకారి కాలేదు. ఈ కార్య యుత్పత్తికి మఱియొకకర్తయం దుండవలయును. భదంతుడు: నీవు వేదాంతివి. బౌద్ధమతస్థురాలవు. కావు. కాళింది: స్వామీ! సందేహములు తీర్చి పెట్టుచుంటివి: నా వేషము బౌద్ధము. నేను బౌద్ధురాల నేలగాను! ఇంకను గొన్ని సందేహము లున్నవి. క్షమించినచో నడిగెదను. భదం: కానిమ్ము. కా: మఱి మీ లయసిద్ధాంతములను జూడుడు. లయము రెండు విధములుగా జరుగుచున్నది. జ్ఞాతము, అజ్ఞాతము. మనుష్యుఁడు తెలిసి చేయునది జ్ఞాతము. రెండవది దానియంతట నది జరుగునది. మీ క్షణిక వాదమువలన లయము నిత్యము జరుగుచునే యున్నది. అది యాపరాదు. క్షణములో జరుగు నీ లయముకంటెఁ బూర్వమప్పటికీ స్థితిలో నున్నది. కారణముగాఁ గార్యమైన సృష్టి

జరుగవలయును. అప్పుడు సృష్టి నిత్యము. కార్యములేకుండఁ గారణమైన స్థితి వ్యర్థము. సిలవనఁగా మీ సిద్ధాంతప్రకారము సత్తయనఁగాఁ గారణత్వము. ఈ విపరీతక్షణికస్థితి కార్యరహితమైనచోఁ దత్పూర్వాపరములు నస్థితికములు. మఱియు శరీరులయం దీ సృష్టిలయములు కన్పించుటలేదు. ప్రతిక్షణము నెవ్వఁడు చచ్చుటలేదు. పైన నేదియు నశించుటలేదు. ఒక జలబిందువు సూర్యాతపమువలన నిగిరిపోయినచో నది నాశమైనట్లు గాన్పించుచున్నది. ద్రవ్యము నశించదు. ఇక మీ మోక్షసిద్ధాంతమునకు నభ్యంతరము. జ్ఞాతృత్వమైన నాత్మ లేనప్పుడు జ్ఞానము యొక్క ప్రయోజన మేమి? ప్రతిదియు క్షణికమైనప్పుడు జ్ఞానాజ్ఞానములు, ధర్మాధర్మములు క్షణికములు. నిర్వాణము స్వరూప మేమి? దేనినుండి నిర్వాణము? కనుక నిత్యమైన దేదియో యుండవలెను. భదం: ఏదియు నిత్యముగాదు. నిత్యమైన దానినుండి వికారము సంభవించదు. సంభవించినచో దానికి నిత్యత్వము లేదు. అందుచేతఁ గార్యము పుట్టకముందు కారణము నశించుచున్నది. విత్తు నశించిపోవుచున్నది. దానినుండి మొక్క వచ్చుచున్నది. కాళింది: అనఁగా నాశనములోనుండి సృష్టి జరుగుచున్నది. ఐనచోఁ గొన్ని ప్రత్యేకలక్షణములుగల నాశనమునుండి తత్ప్రత్యేకలక్షణవిశిష్టమైన సృష్టి జరుగుచున్నదని చెప్పుట యెందులకు? మామిడివిత్తు నశించగా నారింజమొక్క మొలవవచ్చును. దానిని మీ రొప్పుకొనరు గదా! అనఁగా విశిష్టలక్షణములకుఁ బ్రాధాన్యమా? కారణనాశనమునకుఁ బ్రాధాన్యమా? కారణమునకుఁ బ్రాధాన్యమైనచో దానినుండి సముద్భూతమగు కార్యమునకుఁ దత్పూర్వకార్యనాశన మవసరములేదు. భదంతుడు: ఇదియంతయు నేమియు

లేదు. నిష్క్రియమైన యీ జగత్తునందు క్రియాభాస. కాళింది: ఐనచో నిష్క్రియత్వమునుండి యేదియు సముద్భవించదు. కారణములేదు. వ్యాపారములేదు. కార్యములేదు. మీ నిర్వాణమప్రయత్నముగ సిద్ధించును. మీరు మాధ్యమికులు. మీ వాదము యోగాచారుల ననుసరించక సౌత్రాంతికుల ననుసరించును. ఆ ప్రకారము దృశ్యరూపమైన ప్రపంచకమే లేదు. ఆంతర ప్రపంచకమే యున్నది. ఇప్పుడు తమరు చెప్పిన దదియే కదా! భదంతుడు: అవును. సర్వము భావస్థిరము. కాళింది: అయినచో నీ ప్రపంచకము కుందేటికొమ్మువంటిదా? స్వప్నము వంటిదా ? కుందేటి కొమ్మువంటి దైనచో దీనినుండి సుఖదుఃఖములు మన మనుభవించుట యనుభూతిదూరము కావలయును. ఈ ప్రపంచకము సర్వథా లేదనుటకు లేదు. భదంతుడు: మీ వేదాంతులు నట్లేయందురు కదా ! కాళింది: మేము మిథ్యయందుము. మిథ్యయనగా నేమియు లేదనికాదు. జ్ఞానదృష్టికి లేనిదని తాత్పర్యము. దానివలన మోహము పొందరాని దని. భదంతుడు: ఈ బాహిరప్రపంచము స్వప్నము వంటి దందుము. స్వప్నములోఁ జూచుచున్న వస్తువులు లేవు. అవి కనిపించుచుండునే కాని, మనోభావములు ద్వైధీభావము నందును. చూచువాఁడు చూడఁబడునవి—అట్లే యీ ప్రపంచము లేనిదున్నట్లు కనిపించుచున్నది. కాళింది: జాగ్రదవస్థకు స్వప్నావస్థకు భేదమున్నది. మేల్కొన్నంతనే స్వప్నగతమైన విషయ మయథార్థ మని తెలియుచున్నది. మేల్కొన్నప్పుడు చూచినవిషయముల యయథార్థత యెప్పుడు తెలియుచున్నది? పైగా జ్ఞానమనగా నేమి? అనుభవమేకదా! అప్పు డనుభూతమైన విషయము యథార్థముగా నేల గ్రహించరాదు? భదంతుడు: మీ

వేదాంతులు సంతిమేకదా! కాళింది: మేము వేదమును విశ్వసింతుము. మీరు విశ్వసింపరుగదా! మాది మిథ్య. మీరు యయథార్థము. రెంటికిని భేదమున్నది. వస్తువులు లేకుండ తత్ జ్ఞానమెట్లు కలుగును? భదంతుడు: అది జ్ఞానముకాదు. స్మృతి. స్వప్నములోని విషయములు జాగ్రదవస్థలో స్మృతి నంటుకొని యున్నట్లు పూర్వానుభూతవిషయములు స్మృతిపథమునందు ప్రేలాడి భావములుగా భాసించును. కాళింది: అప్పుడైనను మొట్టమొదట నెప్పుడో కలిగిన యీ యనుభవమునకు నీ దోషము పట్టును. భదంతుడు: అక్కఱలేదు. ఆలయవిజ్ఞానమని యొకటున్నది. దానినుండి సర్వస్మృతియు గలుగుచున్నది. కాళింది: అప్పుడా యాలయవిజ్ఞానమునకు నిత్యత్వము కలిగి యుండవలయును. అది మీ క్షణికవాదమునకు వ్యతిరేకము. స్వప్నములో వస్తువులు లేకుండ వస్తువులను జూచితిమి. అది జాగ్రదవస్థలోఁ జూచిన వస్తువుల స్మృతి. జాగ్రదవస్థలోనిది యనుభవము. స్వప్నావస్థలోనిది స్మృతి. మీసిద్ధాంతప్రకారము సర్వము స్మృతి. అనుభవ మాలయవిజ్ఞానసంబంధి. ఆ యాలయవిజ్ఞానమున కనుభవ మెచ్చటిది? ఆ యనుభవము స్వరూపమెట్టిది? అట్టి క్షణికమైన యనుభవమున కీ యాలయత్వ మెట్లుపట్టెను? భదంతుడు: మేము మాధ్యమికులము. మాకీ వాదమే లేదు. నీతో నూరకే వాదించితిని. మా కాత్మయు లేదు. దేహము లేదు. ఏమియును లేదు. కాళింది: మీకు శ్రుతిలేదు, స్మృతిలేదు, ప్రమాణములేదు, అనుమానము లేదు, పక్షము లేదు. యథార్థజ్ఞానము లేదు. ధర్మాధర్మము లెచ్చటినుండి వచ్చినవి? బుద్ధుడు లేడు. బౌద్ధ మెచ్చటనుండివచ్చినది? భదంతుడు: నీవు వేదాంతివివి. వేద

సంతానముపోయినది. బౌద్ధమతపు పైఁకొడుగు తొడుగు కొని లోకమును బ్రతారించుచున్నావు. చక్రవర్తిని మోసము చేయుచున్నావు. మా మతముయొక్క ప్రాశస్త్యము నీతి యందుఁగలదు. మంచినడతయందుఁగలదు. కాళింది: ఏమతము చెడ్డనడత నడువు మని చెప్పును? నీతితోపాటు వేదాంతము. జ్ఞానము పరమార్థవిషయము, మా మతము బోధించును. దానినిగుఱించి నేనియుఁ దెలియని కొంకిబికియూహాలుగల నీ మతము సామాన్యమానవునకుఁ దెలిసిన సామాన్యవాద ములు చేసి జనసామాన్యము నాకట్టుచున్నది. కారణాంతర ములచేత మీవైపునకు మఱలిన చక్రవర్తులు మీమతము మతమని తెలిసికొనరు! ఒక్కొక్కని కొక్కొక్క కారణము. భదంతుఁడు: ఈ చక్రవర్తి కేమికారణము? కాళింది: ఆచార్యా! దొంగదారులు తీయకుము. ఆ ప్రశ్నతోఁ జక్ర వర్తికి నామీఁదఁగోపము కల్గింపవలయుననియా? ఆకారణము చక్రవర్తికిఁ దెలియును. నాకుఁ దెలియును? నాకే తెలియును. చక్రవర్తి కేమి తెలియును? తెలిసిన యింకొక వ్యక్తి యీ మహాసామ్రాజ్యములో మఱియొక్క తెయే కలదు. ఆమె సముఖమున నేను జక్రవర్తి రహస్యమును జెప్పఁ బోవు చున్నాను. భదంతుఁడు: నేను గష్టపడి నిర్మించిన యీ బౌద్ధ సామ్రాజ్యమును నీవు నాశనముచేయఁ జూచుచుంటివా? కాళింది: నీ సామ్రాజ్యముతో నా కేమి యవసరము. నా సామ్రాజ్యము పోనే పోయినది. ఏ సామ్రాజ్యసుస్థితికిఁ గారణ మనుకొని నేను బౌద్ధభిక్షుకురాల నగుట కంగీకరించితినో, యా కారణమే విపరీతఫలదాయిని యయ్యెను. నీ సామ్రాజ్యమున కేమియు భయములేదు. బాహుబలశాంతిముఖులుఁ డున్నాఁడు.

గామసౌఖ్యజనితశాంతిభారమడువచ్చి నట్లుండెను. చక్రవర్తి యిట్లనెను. 'భట్టీ! కాళిందీదేవిని నీవు చూచుటకు వచ్చితివి కావు. అసలీ నాఁడామెను జూడవలసినది. ఆమె భదంతాచార్యునితో వాదించెను. బౌద్ధమతమును ముక్కుదూఁగనగా విమర్శించెను. ఆచార్యునకుఁ బెదవి కదలినదికాదు. ఆమె దేమి పాండిత్యము! నాకు మున్నే బౌద్ధమతమునందు విశ్వాసము లేదు. ఇప్పటి కసలే లేదు. బౌద్ధమతము మత మేమిటి? ఒక నీతిమార్గము. అమ్మ యన్నదికదా! 'నీతి కేమున్నది? ఏ మత మవినీతిని బోధించును' అని. నీరందఱకు నాతండ్రి శాంతిమూల మహారాజుగారికన్న నెక్కువ తెలియునా? ఆయన కృతయుగపురుషుఁడు. నీ విప్పుడే కాళిందీదేవి దగ్గరకుఁ దీసికొని పోదును గాని, నవ్వుచున్నావు. నీవు రాకపోయినచోఁ జేయిపట్టుకొని లాగికొని తీసికొని పోదును. ఆమె మాఘపూర్ణిమనాఁడుగాని మనలనిద్దరను రావద్దన్నది. ఇఱువదియేండ్ల విరహాగ్ని, నా కామె యొక్కదినములో విరహతాపమంతయుఁ దీసివైచినది. కాని యింత నిర్మించిన బౌద్ధమతమును నేను మఱల నెట్లు వెల్లగింతును? అయినను నీ రాజ్యము, నీ మతము బాహుబలునివి. నా కేమి యవసరము?' అనెను. భట్టిదేవి యిట్లనెను. 'అవును. మన కేమి యవసరము. ఈ పదునాలుదినములు మనము బౌద్ధులమే.' చక్రవర్తి: ఓసీ భట్టీ! సరిగాఁ గాళిందీదేవి యాలోచించినట్లే యాలోచించుచుంటివి. నీ వెవ్వరవు? భట్టి: నేను క్షత్రియను. చక్రి: కాళింది భద్రుని కూఁతురు. ఆమెయు క్షత్రియయే. మీ క్షత్రియ స్త్రీల భావనాబలము; అమ్మో!

రాజ్యమంతయు నాఁటి సంయోగము గల్గినదై వాస్త యయ్యెను. చక్రవర్తి భట్టిదేవి సౌధమునఁ బరమమైన శాంతి సౌఖ్యములనుభవించుచుండెను. బాహుబలుఁడు రాజ్యము వెలుపల శత్రువులు చేయు దాడుల నెదుర్కొనుటకు సైన్యసన్నాహములతో మిక్కిలి కలత పొందుచుండెను. వీరపురుషదత్తుఁడు విజయపురమున భిక్షుకునివలె సంచరించుచుండెను. బాహుబలుఁడు సామ్రాజ్య వీథులలోఁ బట్టపు టేనుఁగులమీఁద సంచరించుచుండెను. భట్టిదేవి చక్రవర్తికిఁ బతివ్రతచేయు పరిచర్య చేయుచుండెను. కొండబలి తన భర్తమీఁదికి దండెత్తబోవు నన్నగారి కెలన యుద్ధాశ్వముపైఁ గత్తిఁదూసి సంచరించుచుండెను. భట్టిదేవిపేర వీరపురుషదత్తుఁడు మహాచైత్యమునకు నాయక స్తంభములు నిర్మించెను. కొండబలి యన్నగారిచేత యుద్ధవీథులలో జయస్తంభములు నిర్మించుచుండెను. చక్రవర్తి మఱలిపోయిన శృంగారరసము పొరలివచ్చిన వైరాగ్యరసముతో వియ్యమందుచుండెను. బాహుబలునకుఁ బుట్టుకతో వచ్చిన భిక్షుకత్వము రాజ్యముతో వచ్చిన రౌద్రరసముతో వియ్యమందుచుండెను.

# పంచదశాధ్యాయము

తెల్లని పాలరాతి మహాచైత్యపు నాయక స్తంభముల మీఁద మాఘపూర్ణిమా శిశిరజ్యోత్స్నలు తారాడు యూర్ధ్వపుండ్రములమీఁదఁ దిర్యక్పుండ్రములు తీర్చినట్లుండెను. బుద్ధదేవుని సమాధివలె వెన్నెల లాకాశమున గొంతమేఱ వ్యాపించి పైని లేనట్లుండెను. దూరము, దగ్గరయుఁగాని విజయపురీ పర్వ

తాగ్రదుర్గకుడ్యములకు వేసిన వెల్ల వెన్నెల కెరటముల నెల్ల, చల్ల చల్లగాఁ దెల్ల తెల్లగాఁ దాకెను. ఆ సమయమున గాళిందీసౌధోపరిభాగమునఁ బఱచిన నెల్లకంబళముపై నలువురు వ్యక్తులు కూర్చుండిరి. అందు ముగ్గురు స్త్రీలు; నాల్గవ వాఁడు వీరపురుషరత్నుఁడు. మూఁడవ స్త్రీ చక్రవర్తి. మేనయత్త శాంతిశ్రీ మహాదేవి. ఆమె తలమీఁద తెల్లని శిరోజములు తెల్లని పిల్ల వెన్నెలలు కాయుచున్నట్లుండెను. చక్రవర్తి కాళిందిని చెప్పబోవు కథను శాంతిశ్రీ సాక్ష్యమని గ్రహించెను. 'శాంతిమూలచక్రవర్తికి సంతానము లేదు. శాతవాహనుల సామ్రాజ్యము శాంతిమూలుని వశమైనందులకుఁ త్రైవర్ణికమైన హృదయము మిక్కిలి సంతసించెను. ఆయనకు సంతానము లేనందుకు దుఃఖించెను. అదియొక కథ. శాతవాహన సామ్రాజ్యము సంగతమైనంతనే ధాన్యకటకమున యజ్ఞశ్రీ శాతకర్ణుని కుమారుని కుమారుఁడు గోముఖశాతకర్ణి యిఱువది యేండ్లవాఁడు భృతిపై బ్రతుకుచుండెను. ఆ వంశములో సామ్రాజ్యము పోయెనుగాని, సామ్రాజ్యభావన పోలేదు. ఆ యిఱువది యేండ్ల శాతవాహనునకుఁ దనకు సామ్రాజ్యము లేదని పట్టలేదు. శాంతిమూలునకు సంతానము లేదని పట్టెను. ఆ వంశపుచేవ మెట్టిదో! సామ్రాజ్యములేని తమ వంశపరంపర సాగుటెందులకని, తా నవివాహితుఁడుగా జనిపోవలయునని. ఆత్మ యొకటి భావించినపుడు మనస్సు వేఱొకటి భావించును. ఆతని హృదయ మొక రాచకన్నియయందుఁ దగుల్కొనెను. శాతవాహనులు బ్రాహ్మణులు. ఆ రాచకన్నియ తండ్రి తన కూఁతు నా చక్రవర్తిత్వములేని చక్రవర్తి కిచ్చుట కంగీకరించలేదు. ఆమెయు నా శాతవాహనునియందు బద్ధమనస్క

యయ్యెను. పరస్పర దర్శనమాత్రమున వారిరువురు పులకిత బ్రహ్మపథములఁ బోయిరి. తెల్లపావురాల తుదిపుష్పాలతో జప్పాళలుచేయు వెన్నెల పిల్లలు వారి విరహప్పాల చున్నాలు సారించిరి. వారి పరస్పరాలోకన దీర్ఘమాత్రములు స్వాప్నిక ణాములంత దవ్వుండెను. వారి ప్రేమకు విరహవైక్లబ్యము లేదు. శిశిర దీర్ఘయామినులు బాల్య కిశాంతమునకై సూచికము లయ్యెను. ఇది సంయోగ సౌఖ్యాస్వాదము కాదు. విరహ భావనా సౌఖ్యఫలము. వారిరువురు నొకరి నొకరి తెలియఁగనే తెలియఁగరు. కన్నులు మాత్రమే కలసిన యా యువతీయువకుల సంయోగ వాంఛ శరీరాతిశాయి కావలయును. ఆత్మసంబంధి కావలయును. వారు వియోగదుఃఖ మనుభవింపలేదు. ఇట్లుండగా, నీ శాంతిశ్రీదేవి యారాచకూఁతు తండ్రివద్ద కొకరాయబారము తెచ్చెను. చక్రవర్తికి సంతానములేదు. క్షత్రియశిశువు కావలయును. ఆ శిశువు నెట్లో యొకట్లు రాజాంతఃపురము లోనికిఁ గొనిపోదుము. తాము కన్నశిశువు నెవరైన నిత్తురా?" యని. కన్నబిడ్డ నెవరిత్తురు? ఈను వెడలిపోయెను. ఈ వార్త యా కుటుంబములో నొక విచిత్రమైన యాలోచన పుట్టించెను. చక్రవర్తి కాఁబోవుబిడ్డ క్షత్రియ మాతృగర్భమైనచో సామ్రాజ్యభార వహనదక్షుఁడు కాడు. ఏమిచేయవలయు నేమి చేయవలయునని. అంత వారి కూఁతు రిట్లనెను. 'గోముఖ శాతకర్ణి చక్రవర్తుల యంశ కలవాఁడు. అతనికిఁ బుట్టిన సంతానము నట్లు చేయవచ్చునని. ఆ రాచకుమార్తె యిట్లు చెప్పిన త్రపారహితవాక్యము తల్లిదండ్రులకుఁ గోపము కలిగించెను. తండ్రి కోపించెను. తల్లి యిట్లనెను. "ఇది సమంజసమే. శర్మిష్ఠాది పూర్వ రాజకన్యలు చక్రవర్తులు కాదగిన సంతానము కొఱకు,

సామాన్య కోపభావమైన లజ్జాపరిత్యాగము చేయక పోలేదు."
దినములు గడువగా తండ్రి యంగీకరించెను. కాని గోముఖ శాతకర్ణి యంగీకరించలేదు. తన వంశాంకుర మీరీతిగాఁ జక్రవర్తిత్వమును బొందుట యెట్లాయని యోచించుకొనెను. ఆయన యిట్లు సమాధాన పఱుపఁబడెను. 'కాలము చెడ్డది. అది మఱల నీ యంకెకు రాదు. శాతవాహనులు ధారణి సుమారువందల యేండ్లు ధర్మరక్ష సలిపిరి. ఆ రక్ష మీవలన విరహితమైనను ధర్మరక్ష సాగవలయుఁగదా? శాంతిమూలునకు సంతానము లేనిచో సాగుచున్న ధర్మవాహిని యింకిపోవును. ఆయన యొక వేళ దత్తపుత్రుని కోరని చెప్పును. దానియందు సామ్రాజ్య భావనహానశక్తియు నుండకపోవచ్చును. ధర్మానుష్ఠానశీలత్వ ముండక పోవచ్చు' నని. గోముఖశాతకర్ణి యిట్లనెను. 'చక్రవర్తిత్వము మాలోనుండి పోయి చాల దినములైనది. ఇప్పటి నా సంతానముకూడ సామ్రాజ్య వహనసహము కాక పోవచ్చును' అనఁగాఁ గాదని చెప్పిరి. కాలమువలన సామ్రాజ్యము వానికి దూరముగాఁ బోయెనుగాని వాని రక్తమునందలి శక్తి యెచ్చటకుఁబోవునని యొప్పించిరి. అప్పటివఱకు గోముఖునకుఁ దన్నా రాచకూతురువలన సంతానము కల్పించుమని చెప్పుదురని యతఁడనుకొనలేదు. తన బంధువులలో నొక బాలిక నిచ్చి వివాహము చేయుదు రనిమాత్రమే యూహించెను. ఆ రాచకూతురి తండ్రి పోయి గోముఖునితో నిట్లు చెప్పెను. 'చక్రవర్తీ! మీరు శాంతిమూలుని సంతతి సాంతత్వము కలిగించుట యంగీకరించి నందులకు మీకుఁ గృతజ్ఞుడను. కాని, మీరు బ్రాహ్మణులు. ఇక్ష్వాకులది క్షత్రియ సామ్రాజ్యము. అందుచేత క్షత్రియ స్త్రీయందే తమరికిఁ గలిగిన సంతానము శాంతి

మూలపడుఁ జెందవలయును. తమరు నా కూఁతును ప్రేమించి తిరి. ఆమెయుఁ దమయెడల బద్ధానురాగయై యుండెను. నే నివ్వాహ్యాంగీకరింపలేను. మీ వివాహమున కిష్టపడు నంగీకరింపను. మీరు వివాహ మాడరాదు. ఈ ధర్మాపేక్షకొఱకు, ఆంధ్ర సామ్రాజ్య ధర్మపాలనకొఱకు మీ రామెయందు సంతానము గనవలయును. పురుషశిశువు కలిగినతరువాత మీకును నాకును సంబంధము లేదు. కట్టి ధర్మరక్షాభిలాషతోఁ దమరు దీని కియ్యకొందు రేని లోకోపకారము చేసినవా రగుదు' రనెను. గోముఖ శాతకర్ణి తా నిట్లనెను. 'నాకు సంతానమునం దాస లేదు. నాతో శాతవాహన వంశ మంతరించవలెనని నా యుద్దేశము కదుక నన్నేల బలవంతపెట్టవలయును?' అప్పు డామె తండ్రి యిట్లనెను. "ఆ సంతానము మీ సంతానము కాదు. మీ వంశముయొక్క పారంపరియుఁ గాదు. కట్టి ధర్మరక్షు" యనెను. ఎట్లయిననేమి? శాతవాహనుఁ డందు కంగీకరించెను. వారిరువురకు రహస్యసమాగమ మేర్పడెను. ఆ వీరపురుషుఁడు తన యీ ప్రియాసమాగమున మాసన్నక్షపరిస్థితికి జిక్కిలి దుఃఖించెను. ఆ రాచకూఁతున కానందమునందు లోపము లేకుండెను. ఆయన కానందమే లేకుండెను. ఆ యమ్మకుఁ దన కొడుకు చక్రవర్తి యగునని సంతోషము. ఆతనికిఁ గలుగఁబోవు సంతానము తనకు సంతానమే కాదని. వారిరువురు పరస్పర లగ్నచిత్తులైనను యీ విచిత్ర సంఘటనచేత నది శృంగారరసమే కాక పోయెను. మాధవీలత మాకందతరుశాఖపై పొత్తిగిల్లిన ట్లామె యతనిపై నొత్తిగిల్లును. ఆ మాకందతరువు పశ్చిమవాయువు చేత వెనుకకు లాగఁబడిన చివురాకు హస్తములుగాఁ బెడ మొగము పెట్టును. లోకమునందుఁ దేనటీఁగ పోయి పుష్పము

నందుఁ బరిభ్రమించుట కలదు. అప్పటిఁ బరిభ్రమింపక నిలచి యున్న తేనెటీఁగపైఁ బుష్పమే పరిభ్రమించెను. తాంబూలము సేవించి నవ్వినప్పుడు, పండి పగిలిన దాడిమీ ఫలములతో సంభోగశృంగారలక్ష్మి సామ్రాజ్యధురంధరుడైన వసంతుఁడా శాతవాహనుని మొగములోఁ గనిపించలేదు. ఆ రాజకుమారుని మాత్రము హేమంత హిమపాతమున స్నానమాడెను. వనలక్ష్మివలె నతనియందు వాంఛాదృగంచల యయ్యెను. వారిరువురి ప్రేమయు దృగంత పరిసారమాత్ర పరిపూర్ణమైనదికదా? అందుచే శోభాంచనములయందు విధురచాలనము లేకపోయినది. ఒక్కొక్కప్పుడు ముందు రాబోవు పరిస్థితులు వెనుకటి మాటలలో స్ఫురించును. ఆమె యొకనాఁడన్నది. 'స్వామీ! నీ యీ వైముఖ్యమువలన నేమి విపరీతశిశువు జనించునో? చక్రవర్తుల రక్తము నీ నాడులలోఁ బ్రవహించుచున్నది. అందుచేత బుట్టెడు బిడ్డ చక్రవర్తి కాకతప్పదు గాని నీ యీ వైముఖ్యము వలన వాఁడు సన్యాసి యగునేమో? నా యీ సంతాన భిక్షాభిలాషచేత వాడు భిక్షువగు నేమో?' యని. అప్పుడు చక్రవర్తి యిట్లనెను. 'అది కాదమ్మా! మన సంయోగము ధర్మమైనది కాదు, అధర్మమైనదికాదు. ధర్మాధర్మములుకాని యొక విచిత్ర ధర్మపరిపోషకమైన బుద్ధితో నాశిశువు జనించు ననుకొందును. నిజముగా మనము చేయునది జారత్వము. ఇది తల్లిదండ్రుల యంగీకారములోఁ జేయుచుంటిమి. తనతండ్రి యెవరో తెలియని సంతానము. తన తల్లి రహస్యముగఁ గన్న సంతాన మెన్ని పోకిళ్ళపోయినఁ బోవును. సర్వధర్మవిచ్ఛేదకారి యగును. సంప్రదాయ నిర్మూలనహేతు వగును. తల్లిదండ్రుల రహస్యకామ మంతయు వానియందొక విచిత్రమైన మనోవ్యాపారము లేర్ప

అది, యీ వ్యాకులత యెవరిమీఁదనో, యెందుకో తెల్పరాని పగగాఁ బరిణమించును. అతనివలన లోక మంతయును దుఃక్షోభము పొందును. ఇట్టిసంతానమును గనుట లోకమున కేల పీయవలయును?" ఈమాటల నా దాసీజనము నెంతదిగులుపడెనో యెవరు చెప్పగలరు? కాని శాంతిశ్రీదేవికి దాదావశమైనది. ఆమె యింతటి సమస్యగోపన మెట్లు చేయునో యనియు నాశ్చర్యకరముగా నుండెను. ఆ యాశ్చర్యములో నాదంపతులు తన కోపముతో మఱచిపోవుచు వచ్చిరి."

అంత శాంతిశ్రీ యిట్లనెను. "అప్పటికే నా యన్నగారికి వార్ధక్యము పొడచూపుచుండెను. మాఠరీదేవియు యౌవనము గడచిన స్త్రీ. ఆరాచకూఁతురు తల్లిదండ్రులకుఁ బట్టిన భయమే మాకును బట్టెను. నా యాలోచన చక్రవర్తికిఁ దెలిసినచో నంగీకరింపఁడు. ఆ పన్నాగ మంతయు నేనే పన్నితిని. నాకిద్దరే సాయపడిరి. మాఠరీదేవియు నాపరిచారిక యొకతెయు. మాఠరీదేవి కాపురమునకు వచ్చినప్పటినుండియు నాయందు మిక్కిలి గౌరవము కలది. ఆమెకు నాయం దెంతవిశ్వాస మనగా నేను దలచినపని, చేసినపని సర్వథా నిశ్శ్రేయసములని. నా రాజనీతి వేత్తృత్వము, నావివేకము, నామెను నాయెడల భక్తురాలుగాఁ జేసెను. ఆమె మా యన్నగారియందుఁ బరమభక్తురాలు—మనసా, వాచా, కర్మణా. ఆమె యాయన నెప్పుడుఁ బ్రతారించలేదు. ఈ యొక్క విషయములోఁ బ్రతారణము జరిగెను. దీనివలన నేదైన పాపమున్నచో నాపాపమంతయు నేను దీసికొందునని యామెను దులసివద్ద నిలుచుండఁబెట్టి మాఠరీబృందముగఁ బ్రదక్షిణముచేసి ప్రమాణముచేసితిని. తరువాతఁ జక్రవర్తికి బురుషసంతానము కలుగునని కార్తాంతికులచేతఁ బదేపదే చెప్పించి

తిని. చక్రవర్తికిఁ జినర చినరకు విశ్వాసము కలిగెను. ఇంతలో ధాన్యకటమునుండి యా రాచకూఁతురు గర్భవతి యని వార్త వచ్చెను. నాటినుండి నే నాడిన దొక నాటకమా? మారశ్రీదేవికి సీమంతోత్సవము చేయించితిని. పట్టణమంతయుఁ బండ్లగంపలు పంచిపెట్టించితిని. మూఁడునెలలు దాటినతరువాతఁ జక్రవర్తి నాయొద్దిక లెన్నియేనిపడెను. ఇది యిట్లుండగా రాజ్యములో నెట్లు పుట్టెనో యొక కింవదంతి పుట్టెను. మారశ్రీదేవిగర్భము లేదు, గర్భములేదు. ఇదియొక నాటక మాడుచున్నారని. అట్టి వదంతి పుట్టినచోట నెల్ల గలుపేరించితిని. ఆఱు నెలలు గడచు సరికి నా తలప్రాణము తోకకు వచ్చెను. అది వర్షర్తువు. నాఁడెల్ల వాన కురియుచునే యుండెను. సాయంకాలమునకు శిశూదయము జరుగునని, జరిగిన తరువాతఁ బది గడియలలోఁ బురుషశిశువైనచోఁ బడవమీఁదఁ దెచ్చి యందిత్తురనియు, వార్త వచ్చెను. భగవంతుఁడు నాప్రయత్నముల కనుకూలించెను. వేసిన చినుకేగాని తీసిన చినుకే లేదు. రాత్రి రెండు జాములు దాటినతరువాత కొంచెము తెఱపియిచ్చెను. అంతఃపురములో వేన్నీళ్ళు, గంగాళములు నా యదుపులోనున్న యొక మంత్రసానిని, సర్వము సిద్ధముగా నుంచితిని. ప్రతిపదము మగశిశువు కలుగ లేదేమోయన్న భయము. ఆ నాఁ డెంతమంది మ్రొక్కుల బంగరుసంచులతో బంధించితినో భగవంతున కెఱుక. చివర కన్నియు సరిగా నడచెను. నే నొక బుద్ధిహీనురాలను. ఆ రాచకూఁతురు ధనమున కాశించి తన శిశువు నిచ్చుచున్నదని తలచితిని. ఈ నలుఁబదియేండ్లు నాకా విషయమున యథార్థ జ్ఞానము కలుగలేదు. ఈనాఁడు బోధశ్రీ చెప్పిన మాటలవలనఁ దెలిసినది. అహా! ఆ దంపతులు మనుష్యులా? దేవతలా?

దల్లి దండ్రుల నొప్పించవచ్చు ననుకొనెను. కాని యామె తలిదండ్రు లంగీకరించుటకు మిగుల ప్రయాసయయ్యెను. రెండేండ్లు గడచెను. వా రంగీకరించినతరువాత వీరపురుషుఁడు తాను పెండ్లి చేసికొన ననెను: ఆయన నిరాకరించుటచేత నామె తల్లి దండ్రులకుఁ గోపమువచ్చెను. ఆ వివాహము జరుగునో జరగదో తెలుటకు పదునాఱేండ్లు పట్టెను. అప్పటికి గోముఖశాతకర్ణి విరాగియై వెడలిపోయెను: ఎచ్చటికిఁ బోయెనో యెవ్వరికిని దెలియదు. ఆరాజకూతురు నాటికి ముప్పదియేండ్లుదాటిన యువతి. భర్త దేశాంతరముపోగాఁ దానేమిచేయును? బౌద్ధసన్యాసినివలె వేషము వేసికొనెను. శాంతిశ్రీతోఁ బ్రతిసంవత్సరము వచ్చితన బిడ్డను చూచిపోవుచున్న యామె తనబిడ్డకుఁ బదునెనిమిదేండ్లు వచ్చి శాంతిమూలచక్రవర్తియు, మాఠరీదేవియుఁ జనిపోయిన పదమూఁడవ దినమునఁ దల్లి చనిపోయిన దని దుఃఖించుచున్న వీరపురుషదత్తునకుఁ జనిపోలేదు. బ్రతికియేయున్నానని చెప్పటకుఁ బోయిచూచెను. ఆ మాతృదుఃఖపరిశుష్కతాస్యుని, తన కన్నకొడుకును జూచి యామె యేమనుకొనెనో! అతని చచ్చిపోయిన తల్లి మఱల నేల బ్రదుకవలయుననియే వెడలిపోయెను. ఆతల్లికి నా బిడ్డమీఁది మమకారమెట్టిదో! ఆమె తాను దనబిడ్డ బౌద్ధుఁడని బాధురాలయ్యెను. తనబిడ్డ బౌద్ధుఁడైనందుల కామె యెంత దుఃఖించెనో తెలియదు: తానేమో ధర్మరక్షణకై యంతజేసెను. తనకొడుకు తనయూహించిన ధర్మమునకు వ్యతిరేకముగా నడచెను. తానేమి చేయఁగలదు. తా నతని తల్లినని చెప్పికొనుటకాస్కారములేదు. తనకుఁ దనబిడ్డను బిడ్డా యని పిలిచికొను యోగ్యత లేదు. ఆమె మనస్సెంత కొక విచారము పట్టెను. వీరపురుషుఁడు తన కుమారుఁడు డిల్లయొక్క

ఏకపురుషవ్రతుని రక్తములో వేదధర్మము ప్రవహించదు. ఇది యామె విశ్వాసము. ఆమె తన కడుపునుండి పుట్టిన బిడ్డయొక్క వేదధర్మ పునరుద్ధారణకొఱకు మాతృత్వము బలియిచ్చియుండి తన కన్నతల్లియొక్క భాగమునే చంపివేసెను. ఏకపురుషవ్రతుఁడు శాంతిమూలమహారాజు కొడుకు. మాఠరీదేవి కొడుకు. శరీరముచేత సామ్రాజ్యముచేత శాలికుమారుఁడు. ధర్మముచేత గోముఖ శాతకర్ణి కుమారుఁడు. శరీరముచేత గోముఖ శాతకర్ణి కుమారుఁడు. ధర్మముచేత శాంతిమూల మహారాజు కుమారుఁడు. శరీరసృష్ట్యా మాఠరీదేవి కొడుకు. ధర్మసృష్ట్యా యా రాజకుమారుఁడు కొడుకు. కావోయి తండ్రీ! శరీరముచేత నా రాజకుమారుఁడు కొడుకు. ధర్మముచేత మాఠరీదేవి కొడుకు. అటునిటు ధర్మము చెడలేదు. ధర్మముచేత నతని మాతాపితృలు నిరువంకలఁ జెడలేదు. శరీరములచేత వారలు చనిపోయిరి. ఆ రాజకుమారుఁడు తన కుమారుని కెంత చేయవలయు ననుకొన్నదో యంతయుఁ జేసినది. బౌద్ధాచార్యులతో కొడుకు నెదుట వాదించినది. అతని వాదము పరాస్తము చేసినది. కొడుకును వేదధర్మమందు రక్షించినది. ఏకపురుషుని ఋణము తీర్చినది. నడుమ వచ్చిన కొంచెము దోషమును దొలఁగించినది. నీవు క్షత్రియ స్త్రీకిని బ్రాహ్మణునకును జన్మించినావు. నీది నీచజన్మము కాదు. నీ భార్య భట్టిదేవి జన్మకన్న నీజన్మ యుత్తమమైనది. నీకు సందేహము తీరినదా?” యనెను.

అంత భట్టిదేవి యిట్లు సంబోధించెను. ‘అత్తా’ అని. కాళింది తన ముక్కుపై వ్రేలుంచుకొనెను. భట్టిదేవి గుక్క త్రిప్పుకొని యిట్లనెను. “తల్లీ! సందేహ మెవరికి? ఆయనకు లేదు. నాకు లేదు. నా కున్న దని యాయన యను

కొనుచుండెడివాఁడు. ఇదియంతయు నొక కపటనాటకముగా జరిగెను. మహాపురుషుఁడైన వీరపురుషుఁ డేతాదృక్స్త్రీ పరిణామము చెప్పనే చెప్పెనుగదా! అట్లే జరిగినది. బాహుబలుఁడను పెద్దవాఁడయ్యెను. ఱే పతనిఁ పట్టాభిషేకము జరుగును. అతని వేదధర్మముగూర్చి నీకేమి? నాకేమి? అతఁడు బౌద్ధుఁడై పుట్టెను. బౌద్ధుఁడై పెరిగెను." వీరపురుషదత్తుఁ డిట్లనెను; "నిజమే. అతఁడు బౌద్ధుఁడై పుట్టెను. బౌద్ధుఁడై పెరిగెను. నాకేమి? నీకేమి? భట్టీ! అతనికి ఱేపే పట్టాభిషేకము చేసి నా దారి నేను బోయెదను. ఎప్పటికిఁ బోదునో యెవరికిఁ దెలియును? బౌద్ధభిక్షువను బ్రాహ్మణ సన్యాసి నగుదును. నీవు అ——కాదు. కాళిందీదేవి సౌధమున నీ జీవితమును వెళ్లఁబుచ్చుము. శాంతిమూలమాఠరీదేవులు లేని రాజాంతఃపురములో మన కేమి పని?"

సమాప్తి.